# ద్వితీయ ముద్రణ పీఠిక.



మొదటి తడవ ప్రచురించిన ఈ హిందువుల పండుగల ప్రతులన్నియు ఒక్క సంవత్సరములోనే అమ్ముడుపోయెను. అప్పటినుండియు గ్రంథమునకై యెందరో విచారించిరి. తుదకు మరల ప్రకటింపక తప్పదయ్యెను. "పండుగు" లేక "పండువు" శబ్దము సరియైన రూపమేయైనను వాడుకలో "పండుగ" అనియే యుండుటచేత నేను ఆపదమునే గ్రహించితిని. నా గ్రంథముపై కొన్ని పత్రికలు విమర్శనలు చేసెను. ఆవిమర్శనములను ఈ ద్వితీయావృత్తి ప్రతిలో ముద్రించినాడను. అందలి మంచిచెడ్డలను పాఠకులే నిర్ణయించుకొనగలరు. అయినను ఇందు ఒకటి రెండు విషయములను సూచించెదను. ఆంధ్రపత్రికలోను భారతిలోను విమర్శించిన విమర్శకుడు హిందువుల పండుగలలోని నా విమర్శన భాగములను నిరసించుచు "గ్రంథకర్త మన పండుగుల గాథలను తెలియజేసి నందుల కెంతయు స్తవనీయులే, కాని స్వంతవిమర్శనలను గావింపకున్న బాగుండెడిది" అని సెలవిచ్చెను. ఎందులకు స్వంతవిమర్శనలుకూడదో తెలుపలేదు. నాయభిప్రాయములు సరిగావని వ్రాసెను కాని ఎట్లు సరిగావో తెలుపకపోయెను. విమర్శనలకు భయపడువారికి ఆవాచే అవసరములేదు.

వంపుగలవారై నను చదివి తమ అభిప్రాయముల నిత్తురని కోరుచున్నాను.

“గ్రంథము ఉచితముగ ముద్రించినను, గ్రంథముద్రణవ్యయము వారే భరించినను గ్రంథము వెల అత్యధికముగ నిర్ణయించినారు. లేనిచో గ్రంథకర్త ఉద్దేశము నెరవేరజాలదు” అను భావముతో విమర్శకుని వింతవాదమునకు శ్రీయుత వెంకటరామన్న అవధానిగారు అనాడే జవాబిచ్చిరి. గ్రంథముద్రణ భృతిక్రింద ౫౦౦ రూపాయలను గ్రహించినవారు శ్రీరాజా ధనరాజగిరిగారు. ఆ రూపాయలను నాకే యిచ్చినను నా మొత్తమును గోలకొండ పత్రికాలయమునకే యిచ్చితిని. పైగా గ్రంథముల విక్రయమువలన వచ్చిన ద్రవ్యమంతయు పత్రికాలయమునకే చెందినది. కావున పత్రికాలయమునకు లాభము కలిగినందున పత్రికాసేవ చేయవలెననెడి యీ “గ్రంథకర్త ఉద్దేశము” నెరవేరినందులకు అత్యంతముగా సంతసించుచున్నాను. అయినను ఆ వింతవిమర్శకుని విపరీతవిమర్శనను పరిహాసవిజల్పితమని భావింపక పరమార్థముగానే గ్రహించి యీతడవ గ్రంథము వెల తగ్గించబడినది. ఈ వెలయు “అత్యధికము” గానే యున్నదని యేవిచిత్ర విమర్శకుడైన మరల బయలుదేరి “లేనిచో గ్రంథకర్త యుద్దేశము నెరవేరజాలదు” అని నిందింపకుండుటకై యీమారు తడవకూడ గ్రంథవిక్రయము వలని లాభములన్నియు గోలకొండ పత్రికాలయము వారిదే యని తెలుపుకొనుచున్నాను.

ప్రథమ ముద్రణకగు వ్యయమున కని ౧౦౦ రూపా యీల విరాళమును దయచేసియుండిన శ్రీరాజా ధనరాజగీర్జీ గోస్వామిగారి యుపకృతిని నేరుగాని గోలకొండ పత్రికాలయ మువారుకాని ఎన్నటికిని విస్మరింపజాలము. మరల వారికి మాకృతజ్ఞతలను తెలుపుకొనుచున్నాము

జగద్విఖ్యాతపండితులగు డాక్టరు సర్. యస్. రాధా కృష్ణన్‌గారు నాయందనుగ్రహముంచి ప్రథమముద్రణ పీఠికను ప్రసాదించి యుండిరి. దానినే మరల యీ యావర్తమందు పునః కృతజ్ఞతతో ముద్రించుకొనినారము.

ప్రథమ ముద్రణకు ముఖ్యకారకులు శ్రీరాజా వేంకట రామారెడ్డి బహద్దరు ఒ. బి. ఇ. గారని యిదివరకే మనవి చేసికొని యుంటిని. ఈ ద్వితీయముద్రణమునకును వారే కారకులు. హిందువుల పండుగల వ్రతులను కోరి లభింపని వారు శ్రీవారివద్ద చూపి నేరము [illegible]గా రాజాబహద్దరు గారు ఈ ద్వితీయముద్రణమును [illegible]గావించునటుల తీర్పుచెప్పి పరిష్కరించినారు. [illegible] గుణములచే మేము సర్వదాబద్ధులమని తెలుపుకొనుచున్నాము.

[illegible] సంఖ్య...

శా. శ. ౧౮౫౭

ఈశ్వర. మాఘము.

ఫిబ్రవరి. ౧౯౩౮

దక్షిణహైద్రాబాదు.

సురవరము ప్రతాపరెడ్డి.

# హిందువుల పండుగలను గురించిన అభిప్రాయములు

౧

## హిందువుల పండుగలు.

గ్రంథకర్త. సురవరము ప్రతాపరెడ్డిగారు, బి. ఏ. బి. యల్.

హైదరాబాదు, దక్కన్ వెల ౧-౧౨-౦

(ఆంధ్రపత్రికలోను భారతి ఏప్రెల్ ౧౯౩౨ సంచికలోను గావింపబడిన విమర్శ)

ఈగ్రంథమున హిందువులపండుగులన నేమివిశేషమో యేమియు తెలియని మనుజులకై వ్రాయబడిన దని గ్రంథకర్త తెలియజేసెను. మనపండుగుల విషయమై విద్యాధికు లనేకాను వారికే చాలమందికి తెలియదు. వారు తెలిసికొనుటకు ప్రయత్నించరు. ఆంగ్లవిద్యాభ్యాసమువలన మన నవనాగరికులు విశ్వసింపరు వానిని. అందులకు కొంతవరకు గ్రంథకర్తయే దృష్టాంతము. తులసీవ్రతమాహాత్మ్య సందర్భమున జలంధరుని వధించుటకు విష్ణువు బృందతో రమించెనను వృత్తాంతమును వీరు శంకించుటయేగాక పరిహసించుచున్నారు. జలంధరుని చంపుటకు విష్ణువు బృంద పాతివ్రత్యమును చెరచుటను

నట్టి స్త్రీయొక్క చెట్టుగా జన్మించుటను నాజడ పదార్థమును మానవులు పూజించి విష్ణువ్రతో నైక్యమొందుటను మనము నమ్మవలయునట యని గ్రంథకర్త ఆక్షేపించెను. విష్ణుడే ఇట్టి చర్యను గావించుట నమంజనము కానేరదట. తులసిని బూజించిన నాతనికి ముక్తి కలుగుననుట దురాహ్యామట. తులసి పూజామహాత్మ్యమును నిర్వచించుట జనులమతమును భక్తిని వంచించుట యగునట.

ఆధ్యాత్మికదృష్టితో యోజించిన ఈ అవిశ్వాసము పటాపంచలగును. మనబుద్ధినిట్టి భౌతిక ప్రపంచములో మునిగి తేలుచున్న మనము ఇందలి పరమార్థమును గ్రహింపజాలము.

మరియు జన్మాష్టమినిగూర్చి వ్రాయుచు కృష్ణుని పరమభక్తులే భక్తకోటిక్కై యీపరమపురుషునిచే చిన్నతనమున దొంగతనము చేయించినారు. వయసున వ్యభిచారమును చేయించినారనియు, ఇట్లు వర్ణించుటచే శూద్రాదిజనులలో శ్రీకృష్ణుని గౌరవము తగ్గుచున్నదనియు గ్రంథకర్త వ్రాయదొడంగెను. శ్రీకృష్ణుని గౌరవము శూద్రులలో తగ్గుచున్నదన్న విషయమునకు ఈతరగతివారే గ్రంథకర్తకు తగిన ప్రత్యుత్తరమీయగలరు. భౌతికదృష్టిపరులకు తగ్గనేమో గాని ఆధ్యాత్మిక చింతగలవారికే పాటియు శ్రీకృష్ణునియందు [illegible] మరింత హెచ్చుచున్నది. గౌరవ[illegible]చున్నది. స్థూలదృష్టితో మానవమా

జనులు అర్థములేక చర్విత చర్వణముగ ననుష్ఠించు పండుగల మూలతత్త్వమును పైకెత్తి వెలయించుట లోకహితము. తమ విమర్శనా స్వాతంత్ర్యము నాకు మిక్కిలి నచ్చినది. నాయభి వందనముల గైకొనుడు.

టి. శివశంకరరంగారు (పెనుగొండ)

గోలకొండ పత్రిక. ౩౦-౧-౩౨.

౯

గ్రంథము చాల బోధప్రదముగ నున్నది. శైలిసులభ ముగ నుండి, ఎంత చదివినను విసుగు కలుగకుండ మనోహర మై అచ్చటచ్చట శ్రీరెడ్డిగారికి సహజమగు హాస్యరసోద్దీపక ములగు భావములతో సొంపు నింపుచున్నది.

గ్రంథము నందుల్లేఖింపబడిన పూర్వగ్రంథముల సంఖ్య మిక్కుటముగ నున్నది. దీనినిబట్టి చూచినచో గ్రంథకర్త యొక్క పరిశ్రమ విశదమగుచున్నది. ఇట్టి గ్రంథము నిశ్చయ ముగా నవసరమై యుండెను. ఈ యవసరమును శ్రీరెడ్డిగారు తీర్చి ఆంధ్ర వాఙ్మయమున కొక యమూల్యాలంకారమును సమ కూర్చినవారైరి.

పుస్తకములోని పటములలో గొన్ని చారిత్రికవిఖ్యా తిగలవి వామనుడు భీష్ముడు అను పటములు మొగలుచిత్ర లేఖనాపద్ధతిననుకరించునవై యింపుగూర్చుచున్నవి. శ్రీకృష్ణుని త్రివర్ణచిత్రము ఇదివరకెచ్చటను కానరానిపద్ధతితో చిత్రింప

బడినది. ఇట్టి మంచి గ్రంథమును రచించి భాషాసేవయొనర్చిన శ్రీరెడ్డిగారిని మనఃపూర్వకముగ నభినందించుచున్నాను.

మాడపాటి హనుమంతరావు,
గోలకొండ పత్రిక, ౨౩-౧-౩౭.

౪

దక్షిణ హైదరాబాదునుండి శ్రీయుత సురవరము ప్రతాపరెడ్డి, బి. యే. బి. యల్. గారు రచించిన హిందువుల పండుగలు అను గ్రంథము సులభశైలిని వ్రతపరుల కత్యంతో పయుక్తముగనుండ రచితమయిన నూతనాశయభరితమగు గ్రంథము. ప్రతాపరెడ్డిగారు పాశ్చాత్య విమర్శనవిధానమును బాగుగ నాకళించి చారిత్రిక పరిశోధనలకు బూనిన విద్యాధికులును, సూక్ష్మబుద్ధులు నని యీగ్రంథమే వేయినోళ్ల చాటుచున్నది. హిందువుల కుటుంబములలో నిత్యవిషయము లనదగిన యీపండుగలను గురించి సవిమర్శకముగ వ్రాసిన వారు భారతీయులలో ననేకులులేరు. కావున ప్రతాపరెడ్డిగారి గ్రంథమాంధ్రుల కెంతయు సమాదరణీయము. విజయదశమి దీపావళిలోనగు కొన్ని పండుగులకు రెడ్డిగారు చాల విపులములగు విమర్శనలను చేసియుండిరి. అయ్యవి యెంతయు ప్రశంసాపాత్రములు. ఇట్టి గ్రంథముల నీదినములలో వ్రాయుటచాలకష్టకార్యము. నేను హిందూమతమున ప్రచారమునందున్న పండుగులలో ననేకము లీయిండియాలోనివి కావని యు విస్మృత కాలమున నితరులతో నార్యులును మెలగియుండిన దినములలో సంపర్కాదికారణముల నీసంఘమున సంక్ర

మించినవనియు నొకబలీయమగు వాదన గలదు. ఈవాదనను త్రోసిరాజు చేయుట చాలకష్టమనియే మానమ్మకము. కావున మన దేవతలను గూర్చిగాని, పండుగలను గూర్చిగాని వీనికి సంబంధించిన విషయములను గూర్చిగాని రచించునప్పుడు భారతీయవాఙ్మయమును మాత్రము దృష్టినిబెట్టికొనినచో మనకార్యమసమగ్రమే యగునని మనవి చేయుచున్నారము. రచయితవిమర్శనదృష్టి యత్యంత పురాతనములయిన ఈజిప్టు బాబిలోనియా అస్సీరియా ఖాల్డియాలోనగల సంప్రదాయముల నన్వేషింప నుత్సహింపవలయును.

వివిధదేశ విమర్శకుల పరిశోధనాఫలితముగ నిప్పుడనేకవిషయములు బయల్పడుచున్నవి. హిందూసంప్రదాయముల నేమియు నెఱుంగని యీ విదేశీయవిమర్శకులు చిత్రవిచిత్రములగు సిద్ధాంతములను చేయుచున్నారు. సంస్కృతజ్ఞానమును భారతీయసారస్వతములను బాగుగ నెరింగిన కుశాగ్రబుద్ధులు నూతనోద్ధానములను పరిశీలించి శ్రద్ధవహించినచో భారతవర్షమునకే కాక ప్రపంచమునకంతటికి నొక యమూల్యసేవ నొనరించిన వారగుదురు. శ్రీ శెట్టిగారి యీగ్రంథమట్టి విమర్శకాగ్రగణ్యులకు చేయూతనొసంగజాలి శ్లాఘ్యాపాత్రమగునన్నయది యసంశయము. చక్కని పరిశ్రమనొనర్చి యిట్టి గ్రంథముల నింకను రచించి శెట్టిగారు ఆంధ్రమును నలంకరించి ధన్యులుగా నీశ్వరు డనుగ్రహించుచుగాక.

సమదర్శిని, ౨౮-౨-౩౨.

# "హిందువుల పండుగలు"

హిందువులలో నేఁడనేకులు వారిపండుగల విషయము విశేషముగా తెలియరు. అట్టివారికి పండుగల పరిచయము గలిగించుటయు, విమర్శబుద్ధితో నాలోచించువారికి తగిన యవకాశమును గలిగించి మూఢవిశ్వాసాంధకారము నుండి తొలగించుటయు నీగ్రంథము చేయు ముందుపనులు. పండుగలవిషయము తెలుపునట్టి గ్రంథము లాంధ్రవాఙ్మయమున లేని కొఱతను దీర్చి యిట్టి యుత్కృష్టగ్రంథము నాంధ్రలోకమునకు సమర్పించిన గ్రంథకర్తగారెంతయు ధన్యులు.

ఇట్టి గ్రంథమును రచించి హిందువులకెంతో సేవచేసియున్న శ్రీరెడ్డిగారి ధర్మసేవ మెంతయు శ్లాఘనీయము. ఈ గ్రంథమును వ్రాసినందులకు శ్రీరాజా ధనరాజగీర్జి బహాదురుగారు గ్రంథకర్తకైదువందల రూప్యములు బహుమతినియ్యుటయే కాక దానిని గోలకొండ పత్రికాలయమునకు దానపూర్వకముగా నిచ్చి గ్రంథస్వామ్యములను నొసంగి తమ యవ్యాజ భాషాసేవను ప్రకటించియున్నారు.

ఈ గ్రంథమునందైదు చిత్రపటములు గలవు. అందు ముఖ్యముగా మూడు—శ్రీకృష్ణునిది, వామనునిది, ధన్వంతరిది— చేర్పఁబడియున్నవి. ఎంతయో వ్యయప్రయాసలకోర్చి యీ చిత్రపటములు సేకరింపఁబడినవి. అందు శ్రీకృష్ణుని మీసముగల కృష్ణునిగ జూపుట యొకింతవిశేషము.

ఇటీవల అంగీరస చైత్రమాస "భారతి" యందీ గ్రంథమును జనుగుమిల్లి శాంబశివరావు బి. ఏ. గారు విమర్శించినది చూచితిని. దానిని జూచి విమర్శనాపద్ధతి కాశ్చర్యము కలిగినది. అందు వారికుత్తేజమును గలిగించిన వీక్రింది విషయములు:—

౧. ధర్మస్థాపకుడగు శ్రీవిష్ణువుబృందవంబోలు పతివ్రతను జెఱచలేదట!

౨. తులసీపూజమాత్రము సఫలముగలుగక ఆయుర్వేదప్రకాశము వాడుటలో ఫలమున్నదనుట!

3. శ్రీకృష్ణుని వ్యభిచారిగా నెంచుటవలన నతనిగౌరవము శూద్రాదులలో దగ్గుచున్నదనుట!

౪. శ్రీకృష్ణుని నీలవర్ణుడు కాడని నల్లనివానిగా పేర్కొనుట.

౫. రాహుకేతువుల విషయము శంకించుట!

౬. అచ్చుతప్పుల పొంతి విమర్శనలు గావించుట!

౭. ప్రకాశకులు గ్రంథమునకు రు ౧-౮-౦ వెల నిర్ణయించుట.

అవతారపురుషులాచరించు ప్రతిపనియు నతని నారాధించువారి కాదర్శప్రాయముగ నుండును. వారునట్లే యొనరించుచుందురు. వ్యభిచారము, వంచన యిత్యాదులే శాస్త్రములందు "సర్టిఫై" చేయబడజాలవు. అట్టికృత్యములు నింద్యములును, దూష్యములగుచున్నవి. జనులు మంచిని గ్రహించుట కంత యాలస్యమౌ చెడుగు నంత త్వరగా సులభముగా గ్రహింతురు. మానవుని ప్రవృత్తి మంచిపనులకన్న చెడుపనులందే యెక్కుడుండును. ఆరాధ్య దైవతములనుగూడ వ్యభిచారాది పనులనొనరించు వారిగా భావించిన పామరులు దుష్కృత్యములను దేవతలనే "స్టాండర్డ్" గాదలచుట విశేషముకాదు. తారాశశాంక విజయములో చంద్రుని వ్యభిచార ప్రవృత్తునిజేయు తారచేసినట్టి పురాణగాథలే ప్రమాణముగా జూపబడినవి. తత్ఫలిత మేమయ్యెనో వేఱుగా జెప్పబనిలేదు. దేవతలుగా భావింపబడు తారాచంద్రులే శ్రీవిష్ణువుయొక్క వ్యభిచారములోని "యాధ్యాత్మిక తత్త్వము"ను గ్రహింపలేక చెడుత్రోవలను బట్టునప్పుడు మానవులు—అందును బ్రాహ్మణులచే వేదాధికారస్వత్వమును హరింపబడిన స్త్రీ శూద్రద్విజ బంధువులు ఏమిచేయజాలరో దురూహ్యము! ౧౯౨౫ వ సంవత్సరమున కలకత్తానగరమున పోలీసుచేతను, ప్రజలచేతను గమనింపబడిన గోవింద భవనపు గాథను నింతత్వరలో మఱచిపోజాలిన హిందూసమాజ "యాధ్యాత్మిక" దృష్టిని నెంత వైశాల్యపరచుకొని నను కొందిరో. ఆ శ్రీకృష్ణుడు పదియారువేల గోపికలతో రాసక్రీడసలిపి

దులసిపూజలో గల యాధ్యాత్మిక సూత్ర మెంతైనగలదేమో కూడ తెలుప ప్రార్థన.

3. శ్రీకృష్ణుని వ్యభిచారిగా నెంచుటవలన "భౌతికదృష్టిపరులకు తగ్గనేమోగాని ఆధ్యాత్మిక చింత గలవారికే పాటియు శ్రీకృష్ణునియందు గౌరవము తగ్గలేదు సరికదా మరింత హెచ్చుచున్నది.........స్థూలదృష్టితో మానవమాత్రునిగ శ్రీకృష్ణుని తలంచిచూడ ఆయనలీలలు అటులనే పొడగట్టును" అని సెలవిచ్చియున్నారు శాస్త్రులు. వేదపఠనమునకే యర్హులని యాటంకపఱుపబడియు నింతటి "యాధ్యాత్మిక దృష్టిని గలిగి" భౌతికదృష్టినివీడి యతనివ్యభిచారాదులలోగల యాధ్యాత్మిక భావమును, యతని గౌరవాతిశయమును తెలిసికొనజాలుటెట్టులో తెలియకున్నది. సర్వాధికారములు గలిగియు లౌకికములందు తెనగులాడు బ్రాహ్మణులకే యట్టిది గలుగనప్పుడు శాస్త్రులకట్టి కలిగినవారు శ్రీకృష్ణుని వ్యభిచారము నాధ్యాత్మికదృష్టితో సమర్థింపజాలుటెటులు? హిందువుల పండుగల గ్రంథకర్తయగు శ్రీరెడ్డిగారివంటి నిష్కామసోదర ప్రేమ పూరితుల ప్రయత్నమువల వారు విద్యావంతులై యాధ్యాత్మికదృష్టిని గడించునంతవఱకు శ్రీరావుగారే యట్టివానిని సమర్థింతురని నమ్ముచున్నాను. "శ్రీకృష్ణావతారతత్త్వము"ను గ్రంథమునందే శ్రీకృష్ణుని యట్టిపనులు సమర్థింపబడజాలవు ఇవి మనము నమ్మవలసినవే కాని కారణములడుగ కూడదు" అని వ్రాయబడియున్నది. కాని శ్రీరెడ్డిగారట్లానర్పక శ్రీకృష్ణుడు "తపోదానమార్జవమహింసా సత్యవచన"ములందు ప్రఖ్యాతివహించినవాడని సప్రమాణముగా నిరూపించియున్నారు. ఇదియు విమర్శనార్హమగు లోపమే నేమో?

4. శ్రీకృష్ణుని నీలవర్ణుడనుట సరికాదనియు నల్లనివాడనియు గ్రంథకర్త వ్రాసెను. అందే శ్రీరాజారవివర్మ శ్రీకృష్ణుని నీలవర్ణునిగా నెంచి చిత్రించినాడనియు దరుశాతివారెతని ననుసరించిరనియు, నీకల్పనకుగల కారణములను ప్రతాపరెడ్డిగారు చూపియున్నారు. హిందువుల పండుగలలోని పటముగాక తదితర శ్రీకృష్ణపటములలో నతని నీలవర్ణ

దుగాని చిత్రించియుండుటవల్ల నెట్టి వస్తువు కల్పించిరో యుండునని విమర్శకునికి బోధపడియుండదా. కావున నీవిషయమును వారేమని విమర్శించిరో తెలియకున్నది. శ్రీకృష్ణుడు నల్లనివాడుగను ఆజానుబాహుండుగను నుండుటయే సరియని తోచుచున్నది.

౫. గ్రహణ విశ్రాంతియను రాహుకేతువుల విషయమై సెను శంకించుచున్నారని, విమర్శగ్రంథకర్తగారి సమాధానము శంకించుచున్నట్టులు తోపదు. ఏలన అగ్రంథమునందే జ్యోతిశ్శాస్త్ర గ్రంథమగు గణకానందము నుండి ప్రమాణములను గ్రహించి గ్రహణములకు కారణము రాహుకేతువులుగాక సూర్యచంద్రభూముల నడకయని నిరూపించియున్నారు. వీరే గాక శ్రీమహర్షి స్వామి దయానంద సరస్వతులవారుకూడ నీవిషయమును వేదాది ప్రమాణములవలన నిరూపించియున్నారు. వారిగ్రంథములు జూచిన నిది తేటపడగలదు.

౬. సొంత విమర్శనలు గావించుట యొక దోషముగా పరిగణించియున్నారు. మన హిందూశాస్త్రము వంటి ౧౯౫ కోట్ల సంవత్సరములతో పెక్కు మార్పులు గలిగియున్నదో యసత్యసిద్ధాంతములు ప్రచారమునందున్నవి. అందు ముఖ్యముగా పండుగల విషయమై నెన్ని భేదాభిప్రాయములు మన మత గ్రంథములందున్నవో యీ గ్రంథమును జూచిన తెలియగలదు. కావున వాని నిజతత్త్వమును గ్రహింప సరియగు విమర్శనము లాభకారియగును. ఈగ్రంథములోని కొన్ని విమర్శనలు అసమగ్రములని వారియభిప్రాయము. ఏలన విషయమునూరక విమర్శించినంతనే జిజ్ఞాసువునకు గలుగు లాభమేమియులేదు. దానిని విమర్శించి నిజమైన ప్రకారమును తెలుపుటావశ్యకము. పండుగలను విమర్శించుటతోడనే విడువక వాని స్వరూపమిప్పుడెట్లుండిన హిందూసమాజమునకు ధార్మికాధ్యాత్మిక లాభము చేకూరునో వ్రాసియుండిన నింకను బాగుండెడిది.

౭. "గణితము నుచితముగ ముద్రించినను, గ్రంథముద్రణావ్యయమును దాతలెవరు భరించినను గ్రంథమువెల యత్యధికముగ నిర్ణయింపబడినది. లేనిచో గ్రంథకర్త యుద్దేశ్యము నెరవేరజాలదు" అని యొక్క కల

ముపోటుతో తమ హృదయ భావమును విమర్శకులు వెడల్రగక్కి యున్నారు. గ్రంథమునకు వెలనిర్ణయించినది ప్రకాశకులుగాని గ్రంథకర్తగారుకారు. గ్రంథకర్తగారికిని తమకు బహుమానముగా నొసగబడిన (౫౦౦) ల రూప్యములను ముద్రాలయాధికారుల కొసంగియున్నారు. గ్రంథము ౩౨౦ పుటలది వెల ఒకరూపాయి యెనిమిదణాలు. పదకొని మిదణాలకన్న తక్కువ వెల యత్యధికమేమో పాఠకులూహింపగలరు. "లేనిచో గ్రంథకర్త ఉద్దేశ్యము నెరవేరజాలదు." అను మాటలకర్థమేమి? ఉదరపోషణోద్దేశ్యము వా గ్రంథకర్తగారగు శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారట్టి కోటిలోనివారు గారు. భగవదనుగ్రహమువలన వారి యార్థిక స్థితి బాగుగానున్నది. వేలకొలది రూప్యములను ప్రజాసేవకు వినియోగించుచున్న త్యాగశీలురు. ప్రతి సంవత్సర మమితనష్టమునకోర్చి నిజాం రాష్ట్రీయుల కేకమాత్రాంధ్రపత్రికయగు గోలకొండపత్రికను నిర్వహించుచున్న యుదారహృదయులు. నిజాంరాష్ట్రములోని ప్రతిప్రజాహిత జీవనమునకు తమతమ ధనములతో వినియోగించుకొనిన దేశసేవాపరాయణులు అస్పృశ్యాదిజాతుల నుద్ధరించుటకు ముందంజవేసి కార్యరూపమున చురుకుగా పనిచేయజాలిన సంస్కారప్రియులు. అట్టివారిపై యుదర పోషణ కొఱకు గ్రంథమూల్యమును హెచ్చుగా నుంచిరని నీచారోపణ చేయుట మూర్ఖ్య మమియుటవంటిది. ఇట్టి విమర్శనలవలన వారి గ్రంథమున కేకొరంతయు రాజాలదు. శ్రీరెడ్డిగారికి పరమేశ్వరు డాయురారోగ్యైశ్వర్యముల నెక్కుడుగా నిచ్చి దేశసేవ కవకాశము కలిగించుగాక యని ప్రార్థన.

వేంకటరాజన్న అవధాని.



# ప్రథమ ముద్రణపీఠిక.

ప్రతిమతమందును పండుగలు గలవు. అవి యనేక కారణములచేత జరుపఁబడుచున్నవి. హిందువులందును పండుగలు పెక్కుగలవు. బహుశ హిందువులలోనున్నన్ని పండుగలు లేయితర మతస్థులందును లేవని చెప్పవచ్చును. అయినను హిందువులలో ననేకులనాదాము పండుగల నేల చేయుచున్నారో తెలియదని చెప్పవచ్చును. సుప్రసిద్ధములైన విజయదశమి దీపావళి పండుగలు వినియున్న పండితులు సహితము సరియైన కారణములు చూపించుటలేదు. అంధపరంపరగా వాడుకొను కారణములే చెప్పుదురు కాని యవి సరియైనవా కావా యను విషయమును విచారించు శ్రమపడఁబోరు. ఈ గ్రంథరచనమున కిదియొక కారణమని మొదలే విన్నవించుకొనుచున్నాము.

సాధారణముగా పండుగలను హిందువులు వ్రతములుగా నెంచుచున్నారు. ప్రతి వ్రతమును మంత్రపూర్వకముగ జరుపుచున్నారు. మంత్రముల నుచ్చరించుటకు పురోహితుల యావశ్యకముండును. హిందువులలో బండుగలు బహుప్రాచీనమునుండి యేర్పడుచు వచ్చినవి. వీని విషయమై బహుపురాణములందు చర్చించియున్నారు. ఇంతియగాక కొన్ని స్మృతి గ్రంథములందును వీని చర్చగలదు. హారీతస్మృతియం దిట్లున్నది.

పండుగలు సూచింపబడినవి. పురాణములా సంఖ్యను బెంచినవి. తర్వాత జనసామాన్య మనేక గాథలు త్రవ్వి పైవాని నపరిమితముగా బెంచినది. ఈ కడపటివర్గము పురోహితులందును స్త్రీలయందును విశేషముగా దాగియున్నది."

పై పండితుని యభిప్రాయమందు గొంత సత్యము లేకపోలేదు. బౌద్ధమతయుగము నాటికే హిందువులు తమ పూర్వౌన్నత్యమును గొంత గోల్పోయిరి. ఆకాలము వఱకే స్త్రీకి జ్ఞానమియ్యగూడదని కొన్ని శాస్త్రములు బయలుదేరెను. అట్లు స్త్రీ శూద్రులను మూర్ఖావస్థయం దుంచుటయే గాక వారికి మతవిషయములగు సిద్ధాంతము లంతగా బోధింపకపోయిరి. ఇట్లు స్త్రీ శూద్రులు పరార్థ్యధనులై యుండ వారి నెట్లు చేయదలచిన నట్లు చదివినవారు చేయవచ్చునుగదా! కావుననే వ్రతములు పెచ్చుపెరిగిపోయెను. మఱియు నిజమగు వస్తుతత్త్వమును బోధింపనందున నెవ్వరికి దోచినట్లు వారు పురాణములఁగల్పింప మొదలిడిరి. అనేక వ్రతముల కనేక కథలు కల్పింపఁబడెను. శౌనకాదిమునులో, నారదుఁడో, వైశంపాయనుఁడో, వ్యాసుఁడో, శ్రీకృష్ణుఁడో యెవరోయొకరు బోధకులగుదురు. ధర్మరాజో, జనమేజయుఁడో యెవ్వరో యొకరు శిష్యులై భక్తిపూర్వముగా విందురు. అట్టి గురుశిష్యుల సంవాదమును హిందువులందఱు కిమ్మనక యాదరించి భక్తిశ్రద్ధాయుక్తులై యాచరించి కొనవలయును. ఇట్లుత్సవము లనేకము లుత్పత్తియయ్యెను.

ప్రకృతము నేను వ్రాసిన గ్రంథమందలి విషయములు పండుగలన నేమి విశేషమో యేమియు దెలియని జనులకై వ్రాయఁబడినవి. ఈ గ్రంథమును వ్రాయుట కింకొక కారణము కూడఁగలదు, అది వినఁదగిన యంశము. వినోదకరమగు నంశమును. విభవసంవత్సర విజయదశమీ దివసమున మహాఘనత నహించిన శ్రీనిజాము ప్రభువుగారు శ్రీ రాజా వెంకటరామా రెడ్డి బహద్దరు (కొత్వాలు) గారిని విజయదశమిని హిందువు లెందుకు జేయుదురని విచారింప వారిది అర్జును డుత్తర గోగ్రహణమునందు శత్రువుల జయించిన కారణమునఁ జేయఁబడు చున్నదని నడివిరట. "ఇంతకు పూర్వ మొకరిని విచారింప నతఁడిది శ్రీరాములు రావణునిపై జయముపొందిన సందర్భమున జరుగునదని చెప్పెను. ఎవరిమాటనిజము" అని మ॥ ఘ॥ శ్రీ నిజాంప్రభువుగారు విచారింప శ్రీ రెడ్డిగారు నిరుత్తరులై అదే దివసమందే శ్రీరాజా ధనరాజగిర్జీగారితో యీవిషయమును గుఱించి ముచ్చటించిన వారఁట. శ్రీధనరాజగిర్జీగారును హిందువులు తమ తమ పండుగుల సంగతి నేమియు నెఱుఁగకుండుట యెంతటి హాస్యాస్పదమో కదా యని విచారించి యెవరిచేనైన నీవిషయికమగు గ్రంథ మొక దానిని వ్రాయించినఁ జాలబాగుండెడి దని సెలవిచ్చిరట. అప్పుడు శ్రీరాజా వేంకటరామారెడ్డి బహద్దరుగారు నన్నీపని నెరవేర్చుమని యాదేశించిరి. అందులకు సామర్థ్యము లేకున్నను వారి యక్షిలాష యనుల్లంఘనీయమగుటఁ జేసి యీగ్రంథమును వ్రాసితిని.

ఆంధ్రమందిట్టి గ్రంథముండినట్లు నాకు గానరాలేదు. మఱియు నాంగ్లమందును రెండు మూడు గ్రంథములున్నను

నయ్యవి యీవిషయమును తృప్తికరముగాఁ జర్చించినవిగావు.

ప్రతి పండుగను గుఱించి కొన్ని విమర్శనలు వ్రాసినాడ అవి యెంతవఱకు సమంజసముగా నున్నవో పాఠకులే నిర్ణ యింపగలరు. ఏది యెట్లున్నను నాసాహసమును గుణగ్రహణ పారీణులు మన్నించి యిందు విశేషమున్న గ్రహించి తప్పు లను జూపించిన రెండవ ముద్రణ మీగ్రంథమున కల్పనేని యందు కృతజ్ఞతావందన పూర్వకముగా సవరించుకొందునని విన్నవించుచున్నాఁడ.

ఈ గ్రంథమందు వ్రాసిన విషయములలో పండుగ, ఉత్సవము, వ్రతము, జయంతి, మున్నగునవన్నియుఁ జేరినను సౌకర్యార్థము గ్రంథనామము "హిందువుల పండుగలు" అని యే నిర్ణయించితిని.

ఈ పండుగల విషయమై యింకను విశేషముగా తెలిసి కొనగోరువారి క్రింది గ్రంథములు చూడగలరు.

౧. వ్రతచూడామణి.

౨. వ్రతరాజము.

౩. జయసింహ కల్పద్రుమము.

౪. ధర్మసింధువు.

౫. నిర్ణయసింధువు.

౬. భవిష్యత్ పురాణము.

౭. స్కాందపురాణము

౮. Hindu Holidays and Festivals

by B. A. Gupta

౯. ఆర్యపర్వపద్ధతి (హిందీ)

ఈ యుపోద్ఘాతమును ముగించుటకు బూర్వ మొక ముఖ్య విషయము మనవి చేసికొనవలసియున్నది. ఈ గ్రంథమునకుఁ గారకులును, కోటీశ్వరులును, నుదారాశయులును, భూరిదాతలును నగు శ్రీరాజా ధనరాజగిర్జీగారు ౫౦౦ హాలీ రూపాయీలు ఈ గ్రంథముద్రణ వ్యయమునకని గోలకొండ పత్రికా కార్యాలయమువారికి అనుగ్రహించి యున్నారు. వారికి నేనెంతయు గృతజ్ఞుడను. వారికిఁ బరమేశ్వరుఁ డితోధికాయు రారోగ్యైశ్వర్యముల బ్రసాదించుగాత.

ఈ గ్రంథమునకు పీఠికను వ్రాసియిచ్చిన డా॥ సర్. యస్. రాధాకృష్ణగారికి నేనత్యంత కృతజ్ఞుడను.

ఇట్లు

క్రీ.శ. ౧౯౪౧. సురవరము ప్రతాపరెడ్డి.



# చిత్రపటముల వివరము.

**శ్రీకృష్ణుడు**:-త్రివర్ణచిత్రము. ఇది కే. రామాచార్యులుగారు అను చిత్రలేఖకులచే నాభావముల ననుసరించి వ్రాయఁబడినట్టిది.

**వామనుడు**:-ఇది సుమారు ౨౦౦ ఏండ్లక్రిందటి చిత్తరువు దీనిని నేను హైదరాబాదు నగరములో కొని యుంటిని.

**భీష్ముడు**:- ఈ పటమందు భీష్ముడు అంబ, అంబిక, అంబాలికను గొనిపోవుచు నాపడుచుల చుట్టములతో యుద్ధము చేయుట చిత్రింపబడినది. ఈ చిత్తరువు సుమారు ౨౦౦ ఏండ్లనాటిది. మొగలాయి చిత్రము (Mogul school) ఇది గద్వాల సంస్థానపు రాజుల గ్రంథాగారముది.

**త్రిమూర్తివిగ్రహము**:-ఇది ఎలిఫెంటా ద్వీపములోని శిల్ప ప్రతిబింబము. దత్తాత్రేయుని నిరూపించునది.

**శివలింగము**:—ఇదియు ఎలిఫెంటా ద్వీపములోనిది.

# వ్రతమనగా నేమి







వ్రతమను పదమునకు వాచస్పత్యనిఘంటు కారుడగు తారానాథ తర్కవాచస్పతి యిట్లర్థము చేసియున్నాడు.

ప్రజభుజస్మృతిః । భక్షణభేదే ఉణాది పుణ్యసాధనే ఉపవాసాది నియమభేదేచ॥

అనగా పుణ్య సాధనమునకై యుపవాసాది నియమములచే జేయు కార్యమునకు వ్రతమని యర్థము.

దీనినే వివరించుచు పైనిఘంటున నిట్లు వ్రాయబడినది.

“వ్రతం చసమ్యక్ఞం కల్పజవితానుక్తయా క్రియా విశేషరూపం తచ్చప్ర వృత్తినివృత్త్యర్థయరూపం తత్రద్రవ్య విశేష భోజన పూజాదికం ప్రవృత్తి రూపం ఉపవాసాదికంచ నివృత్తిరూపం తచ్చనిత్యం నైమిత్తికం కామ్యం చ నిత్యమేకాదశ్యాదివ్రతం నైమిత్తికం చాంద్రాయణాది వ్రతం కామ్యం తత్తత్ఫలప్రకాశరూపం”

దీనియర్థమేమనగ వ్రతమనసంకల్ప పూర్వకముగా సమ్యగనుష్ఠానము చేయుట.



ఈవ్రతము ప్రవృత్తి నివృత్తి రూపములని రెండు విధములు. భోజన పూజాదికములతో గూడినది ప్రవృత్తి రూ

పము. ఉపవాసాదిక మైనది నివృత్తి రూపము. వ్రతములు మూడు విధములయినవి. ౧ నిత్యవ్రతములు. (౨) నైమిత్తిక వ్రతములు (౩) కామ్యవ్రతములు.

౧. ఏకాదశీ వ్రతముల వంటి త్రికాలము లందును జేయఁద గినవి గాన నట్టివి నిత్యవ్రతము లనఁబడును.

౨. చాంద్రాయణాది వ్రతములు నైమిత్తికములనఁబడును.

౩. ఆయాతిథులందుపవాసముండి చేయువ్రతములు కామ్యము లనఁబడును.

వ్రతములలో నింకను ననేక విధములయినవి కలవు. అందుమానసిక వ్రతములను గుఱించి వరాహ పురాణ మంది ట్లున్నది.

శ్లో॥ అహింసా సత్యమస్తేయం బ్రహ్మచర్యమకల్మషం।
ఏతానిమానసాన్యాహు ర్వ్రతానివ్రత ధారిణాం॥
ఏకభుక్తం తథానక్త ముపవాసాది కంచయత్।
తత్సర్వం కాయికంపుంసాం వ్రతంభవతి నాన్యథా॥

వ్రతములు మానసికములు కాయికములని రెండు విధములు. అందు అహింస, సత్యము, దొంగతనముచేయకుండుట, బ్రహ్మ చర్యము, అకల్మషత్వము, ఈగుణముల గలిగియుండుట మాన సిక వ్రతములనఁబడును. ఇఁక యొక్కప్రొద్దు రాత్రికాలమందు పవాసముండుట, మొదలగునవి కాయిక వ్రతము లనఁబడును.

వ్రతానుష్టానముల పద్ధతి బహు ప్రాచీనమునుండివచ్చి నట్లు కొన్నిపురాణ ప్రమాణముల వలనఁ దెలియవచ్చెడి.

ప్రాచీన కాలమందు రాజులు తమ యభీష్టముల సిద్ధిగోఁ వైు వ్రతములఁ జేయుచుండిరని మనము పురాణగాథలందుఁ జదువుచుందుము. గరుడ పురాణమందుఁ బూర్వము నానారాజులు వ్రతముల వలన నెట్టిఫలమును బొందిరో వర్ణింపఁ బడినది. ఆశ్లోకముల నీక్రింద నుదహరించుచున్నాను.

శ్లో॥ దుంధుమారస్తు రాజర్షి శ్శేఖేపుత్ర శతంవరాః।
దానేన నియమేనైన తపసా వ్రతేనచ॥
సగరో నామరాజర్షి ర్గత్తుస్సర్వాసువిశ్రుతిః।
పుత్రాణాంచ శతంప్రాప్తం తేన రాజ్ఞామహాత్మనా॥
తథాదశర, రాజ, వ్రతేషునిరతస్సదా।
యజ్ఞదానతపోయోగైః సంతుష్టః పురుషోత్తమః॥
స్వయం పుత్రత్వమాపేశ, తస్యరాజ్ఞో మహాత్మనః।
జనకో నామ రాజర్షి స్తపోవ్రతవిధిస్స్వయం॥
ఐశ్వర్యమతులం ప్రాప్య, యోగినాంగతి మాప్తవాన్।
ఏవ మేవ మహారాజ రాజానో బ్రాహ్మణస్తథా
ఐశ్వర్య మతులం ప్రాపుర్గతిం వైవ్రత వైభవాత్॥

దీనిభావ మేమన. దాననియమ తపోవ్రతములచేత బూర్వము ధుంధుమారుడను రాజు నూర్గుర కుమారుల గనెను. దశరథ మహారాజు వ్రతములకుఁ బురుషోత్తముడు మెచ్చి తానే యాతని పుత్రుఁడై జన్మించెను. జనక మహారాజు తపోవ్రతములచేత నైశ్వర్యవంతుఁడై యుత్తమగతిని బొందెను. ఈప్రకారమే పూర్వము రాజులును బ్రాహ్మణులును వ్రతవైభవముచే నైశ్వర్యములను బొందిరి. వ్రతములవలని లాభములనుగుఱించి ఆదిత్యపురాణమిట్లు చెప్పుచున్నది.

శ్లో॥ వ్రతోపవాసాన్ ఖలుయోవిధత్తే
దారిద్ర్యపాశం సభినత్తిచాశు,
వ్రతోపవాసేషు రతస్యపుంసః
నైవాపదస్స్యంతి మహాంతితస్య॥

వ్రతములు ఉపవాసములు చేయువాడు తనదారిద్ర్యమును బోగొట్టుకొనుచున్నాడు. మరియు వాని కేయాపదలును నుండవు. అని దీని అభిప్రాయము

గుణములందునీచుఁడై కేవలము వ్రతోపవాసములుచేసి నఫలములేదు. వ్రతమునకు దగినట్లుగా నుత్తమగుణములు కూడ గలిగి యుండినవానికిఁజాల శ్రేయస్సుగలుగును. ఈయంశమునే స్కాందపురాణమిట్లు బోధించుచున్నది.

శ్లో॥ నిజవర్ణాశ్రమాచార నిరతశ్శుద్ధమానసః
వ్రతేష్వధికృతో రాజన్ అన్యథావిఫలః శ్రమః
అలుబ్ధస్సత్యవాదీచ సర్వభూతహితేరతః।
వ్రతేష్వధికృతో ... ...
శ్రద్ధావాన్ న్యాయభీరుశ్చ మదదంభ వివర్జితః।
వ్రతేష్వధి ... ... ...
సమస్సర్వేషు భూతేషు శివభక్తో జితేంద్రియః
వ్రతేష్వధి ... ...

నిజకులాచారములను విడువని వాఁడును శుద్ధమానసుఁడును, లోభి కానివాఁడును, సత్యవాక్పరిపాలకుఁడును, సర్వభూతముల మేలుకోరువాఁడును, న్యాయశీలుఁడును, మదదంభాది దుర్గుణరహితుఁడును, దేవభక్తుఁడును, జితేంద్రియుఁడును నగు వాఁడే వ్రతములు చేయఁదగినవాఁడు కాని యితరుఁడు చేసిన

నదివిఫలమగును అని దీనిభావము. దేవలుఁడు తనస్మృతి గ్రంథమందును నిట్లుసెలవిచ్చి నాఁడు.

శ్లో॥ వ్రతోపవాస నియమైః శరీరోత్తాపనైస్తథా
వర్ణాస్సర్వేపి ముచ్యంతే పాతకేభ్యోన సంశయః॥

అనగా వ్రతోపవాస నియములచేతమనుష్యుడు తనపాపములనుండి విముక్తి చెందుచున్నాడు.

ఇక వ్రతములు నెవ్వరెవ్వరు చేయవచ్చునో విచారింతము బ్రాహ్మణాది ద్విజాతులకు మతమందు సర్వాధికారములుండు మాటనిస్సందేహము. ఇక మిగిలినవారు శూద్రులు.

శ్లో॥ తస్మాద్వేదః పరోమంత్రో నమంత్రో వేదవర్జితః।
నమంత్రాధికారోస్తి శూద్రాణాం నియమః పరః॥
మంత్రాభావాద మంత్రేణ భాషితం సర్వకర్మహి॥

అనగా వేదముకన్న వేరుమంత్రము లేదు. వేదమేమంత్రము. శూద్రునికి మంత్రాధికారములేదు. మంత్రాధికారము లేనందున వానికి సర్వకర్మలు అమంత్రకముగానే యుండవలెను. ఈశూద్రులకుతోడుస్త్రీలు. స్త్రీశూద్రులకు మనమతమందు హక్కులేనాఁడు తద్దినోనాటి నుండియు మతముక్షీణించి పోయెననుటలో సందేహములేదు. శూద్రులు కూడ వ్రతములు చేయవచ్చునని వ్రతగ్రంథకారులు వ్రాసియున్నారు. కాని శూద్రులవ్రతములు అమంత్రకముగానుండవలెనని పైయుదాహృతశ్లోకమువలన విశదము. ఒకవేళ కొన్నివ్రతములకు మంత్రము లవసరమైన వారికి పౌరాణిక మగు మంత్రములే

చెప్పవలెను. కాని వేదమంత్రములు చెప్పి వైదికముగ వ్రత
ములు చేయింప గూడదని చెప్పుదురు. స్త్రీలు శూద్రులకన్న
గనిష్ఠులు. మనయాచారమందు స్త్రీలకు స్వాతంత్ర్యమే లేదని
యనేక నీతిగ్రంథములు శాస్త్రగ్రంథములు బయలుదేరెను.

ఆజన్మమరణము స్త్రీకి స్వాతంత్ర్యమే లేని కార
ణమున స్త్రీకి వ్రతాధికార మున్నదా లేదా యను సంగతి విచారించవల
ముగాక.

మార్కండేయ పురాణమందిట్లున్నది.

శ్లో॥ నాస్తి స్త్రీణాం పృథగ్యజ్ఞో
న వ్రతం నాప్యుపోషణం
భర్తృశుశ్రూషయైవైతా
లోకానిష్టాన్ వ్రజంతిహి

ఆదిత్యపురాణమందును మనుస్మృతియందును నిదే
శ్లోకము కించిద్భేదముతో వ్రాయబడియున్నది ఇట్టి యభి
ప్రాయమే యితర పురాణములందును గనబడుచున్నది. దీని
భావమేమన స్త్రీలకు యజ్ఞముగాని, వ్రతముగాని, నుపవాస
ముగాని నవసరములేదు. భర్తయొక్క శుశ్రూషయే వారికి
ముఖ్యవ్రతము. దీనిచేత వారి కిష్టమైన లోకములను వారు
పొందగలరు-

మన్వాది ధర్మశాస్త్రములందును స్త్రీలకువ్రతాధికార
ములులేవని స్పష్టీకరింపబడినవి. పరాశరస్మృతియందీ క్రింది
శ్లోకములుగలవు.

కొన స్నానముచేయుదురు. పూజావిషయములలో నన్నిపూజ లను బ్రొద్దుననేచేయుటకువీలులేదు. శివరాత్రి, ఏకాదశివంటి పండుగలనాడు రాత్రియంతయు జాగరణముచేసి యారాత్రి యంతయు దేవధ్యానము తద్దేవకథా శ్రవణము చేయవల యును. పూజలలో మనుష్యపూజయు, పితృపూజయు దేవపూ జయునని మూడువిధములైనవి కలవు. ఈపూజల విషయమై నరసింహ పురాణమిట్లు చెప్పుచున్నది.

శ్లో॥ దైవత్యంతుపూర్వాహ్ణే మనుష్యాణాంచ మధ్యమే।
అపరాహ్ణేపితౄణాంచ కార్యాణ్యేతునియత్నతః॥

అనగా ప్రాతఃకాలమందు దేవపూజయు మధ్యాహ్న మందు మనుష్యపూజయు అపరాహ్ణమందు పితృదేవతల పూజ యు గావింపవలయును.

వ్రతము లనుష్ఠించుచుండియు బ్రిమత్తతచేత దానిని బూర్తిగావింపక పోయినవాడు మహాపాతక మనుభవించుచుం డునని పురాణములు చెప్పుచున్నవి.

శ్లో॥ యోగృహీత్వా వ్రతంమోహాత్ నాచరేత్ కామమోహితః,
జీవన్ భవతిచండాలో మృతశ్శ్వాప్యభిజాయతే॥

ఎవ్వాడు వ్రతమారంభముచేసి మోహముచే దాని నాచరింపడో వాడు బ్రతికియుండగనే చండాలుడగును. మఱియు చచ్చిన పిదప కుక్కయై పుట్టును. అని పై శ్లోకముయొక్క యర్థము.

ఇవివ్రతముయొక్క ముఖ్యాంశములు.

ప్రతిపండుగ నకును గాల నిర్ణయముకూడకలదు. దీపావళినాడు చీకటిలోనే స్నానముచేసి దీపములు వెలిగించవలెను. హోలీపండుగను రాత్రిపూటనే చేయవలెను. పగలు చేసిన ప్రైన రాజును రాజ్యమును నాశనమగుట నిశ్చయమని వ్రాసినారు. విజయదశమిని సాయంకాలమే చేయవలెను. ఈప్రకారముగా నాయా పండుగలు చేయు విషయమై కాలనిర్ణయమును వ్రతగ్రంథకారులు నిర్ణయించినారు.

వ్రత స్వరూపమును గురించి అగ్ని పురాణమందు వ్రత పరిభాష యను శీర్షికలో విపులముగా వ్రాయబడినది. వ్రతస్వరూపమును గురించి మరియు పైగాను విషయములు వివరింపబడినవి. కాని ప్రతిపదాద్య మావాస్య పర్యంతము నుండు పండుగలు మాత్రము సూచింపబడినవే కాని వివరింపబడలేదు. ఈపురాణము బౌద్ధ మైన మహావ్యాప్తి నంతరము వ్రాయబడినదని యీ పురాణమందలి "బుద్ధాద్యవతార ప్రకరణము" లోని యంశములే చాటుచున్నవి.

ఇక వ్రతములవలని ఫలములను గురించి వ్రతకారుల యభిప్రాయమును విమర్శింతును. ఒక్కొక్క వ్రతమును వర్ణించుచో పౌరాణికులా వ్రతమున కన్నివ్రతములకన్న నెక్కుడు ప్రాముఖ్యత నొసగినారు. ఆవ్రతముతో సమానమగు వ్రతము మరొక్కటి లేదని వర్ణించినారు. "వ్రతానా ముత్తమం వ్రతం"

అని శ్లాఘించినారు. ప్రతివ్రతమున కేదోయొక మహాఫలమును వ్రాసినారు. సాధారణముగా నన్నివ్రతములఫలములు దీర్ఘాయువు ధనధాన్య సమృద్ధి, సుఖసంపద, సర్వపాపవిముక్తి కలుగునని వ్రాయబడినది. మఱికొన్ని వ్రతములకు స్వర్గప్రాప్తి యైయున్నది. కొన్నివ్రతముల ఫల మనంతమని వర్ణింపబడినది.

దీనివలన ఇంతమాత్రము మన మూహింపవచ్చును. వ్రతగ్రంథకారులు ప్రతివ్రత మందును విశ్వాసము, శ్రద్ధాభక్తులు జనసామాన్యమున నుత్పత్తి కావలెనని యిట్లు వ్రాసిరే కాని వేరభిప్రాయముతో కానేరదు.



# దీపావళి.

ఈ పండుగను నరక చతుర్దశియని కూడ వ్యవహరింతురు. ఇది ప్రతి సంవత్సరము ఆశ్వయుజ కృష్ణ చతుర్దశి దినమున చేయబడును.

ఈ పండుగ విషయమై యనేక కథలు చెప్పబడుచున్నవి అందులో ముఖ్యమైనవి.

1. శ్రీకృష్ణుడు సత్యభామా సహాయుడై నరకాసురుని చంపుట,
2. బలిచక్రవర్తి వామనునిచేత దన సామ్రాజ్యమును గోలుపోవుట,
3. శ్రీరాములు రావణవధానంతరము రాజ్య పట్టాభిషిక్తుడైన దినమగుట.
4. నరకమునుండి విముక్తి పొందుటకై యమునిగూర్చి ప్రార్థించుట,
5. విక్రమార్క చక్రవర్తి యాదినమున పట్టాభిషిక్తుడగుట,

పై కారణములచేత నీ దీపావళి జరుపబడుచున్నదని తెలియుచున్నది.

వీనిలో నేది నిజమో పిమ్మట నిరూపించెదను.

మొదలు పై కథ లేవియో క్లుప్తముగా సూచింతును

1. నరకాసురవధ — ఈకథ యాంధ్ర దేశమందంతటను దక్షిణమునను దీపావళికి ముఖ్యకారణముగా భావింపబడుచు

న్నది. కావుననే యీచతుర్దశి "నరక" చతుర్దశియని చెప్పబడుచున్నది. నరకాసురవధను గురించినకథ భాగవతమందును హరివంశమందును చెప్పబడియున్నది. నరకాసురుడు లోకకంటకుడు కాగా శ్రీకృష్ణుడు వాని వధింప బ్రయాణమయ్యెను. సత్యభామయు నాతని వెంబడించెను. శ్రీకృష్ణుడు మొదలు మురరాక్షసుని వాని పుత్రులను జంపెను. నరకుడిదిమాదికోపోద్రిక్తుడై కృష్ణునిపై యుద్ధమునకు వచ్చెను. అప్పుడు సత్యభామ నరకాసురునితో ఘోరయుద్ధము జేసి యలసిపోయెను. శ్రీకృష్ణుడామెకు సహాయుడై నరకాసురుని వధించెను.

౨- బలిచక్రవర్తికథ:— బలిచక్రవర్తికథ భాగవతమందు విపులముగా వర్ణింపబడినది. బలియనురాజు దానమందు బ్రఖ్యాతి వహించినవాడు. వేడిన యర్థులకు లేదనువాడుకాడు. అప్పుడు విష్ణువు వామనావతారమెత్తి బలిచక్రవర్తిని మూడడుగుల భూమిని వేడి రెండుపాదములచే భూమ్యాకాశముల నావరించి మూడవ పాదమునకు తావు లేక దానిని బలిచక్రవర్తి శిరముపైనుంచి యతనిని పాతాళమునకు ద్రొక్కెను. ఆకారణము చేతనే యీచతుర్దశి దినము పుణ్యదినముగా భావింపబడుచున్నదని చెప్పుదురు. వ్రతరాజము మున్నగు వ్రతగ్రంథములందు దీపావళినిగురించి వ్రాయుచోట సత్యభామా కృష్ణుల కథయొక్క సూచనయే లేదు. వానిలో బలిచక్రవర్తికథయే యున్నది ఎట్లన.

శ్లో॥ చతుర్దశీ దినే రాజ్యం బలేర స్త్వితియాచరేత్।
పురా వామన రూపేణ ప్రార్థయిత్వా ధరామిమాం॥
దదావ తిథి రింద్రాయ బలిం పాతాళ వాసినం।
కృత్వా దైత్య పతిం దద్యా దహోరాత్రత్రయం హరిః॥
తస్మాత్మహోత్సవం చాత్ర సర్వైరేవ హి కారయేత్।
మహారాత్రిస్స ముత్పన్నా చతుర్దశ్యాం మునీశ్వరాః॥

... ... ... ...

దీపదానాది కార్యేషు గ్రాహ్యమధ్యాహ్న కాలికా।
తతః ప్రదోష సమయే దీపాన్ దద్యాన్మనోరమాన్॥

౭. శ్రీరామ పట్టాభిషేకము—ఇందును గురించి ప్రమాణము లెవ్వియు లేవు. రాముడీదినమున పట్టాభిషిక్తుడయ్యెనట.

౮. నరకవిముక్తి:—నరక చతుర్దశియను పదములోని నరకమునకు యమలోకము అని యర్థము. దానినుండి విముక్తి పొందుటకై ఈయుత్సవము చేయవలెనని దీని భావము.

వ్రతచూడామణియందీ సూచనయున్నది.

శ్లో॥ "యమాయ ధర్మరాజాయ మృత్యవేచాంతకాయచ॥"

ఇందు యమపూజా విధి చెప్పబడి యున్నది. గుప్త అనువారు ఈయంశమునే ఇట్లు అన్వయించినారు. "నరకమనగా ముక్తి యనియు కార్తీక మాసమందే సూర్యుడు తులారాశి చేరుననియు దానివలన రాత్రులు దీర్ఘమగు ననియు, నీనరకమును పరిశుభ్రపఱచుట కిదియే యదననియు నరకాసురుడు భూదేవీ కుమారుడనుటచేత భూమినుండియేముక్తి యుత్పన్న

మయ్యేనని చెప్పుట కిదియొక కథగా గల్పింపబడె ననియు వ్రాసియున్నారు* ఈ వివరణయంతయు ఒకయుక్తిగా దోచుచున్నది.

౫. విక్రమార్కునికథ:—విక్రమార్కశకమును లెక్కించువారి కీ దినమునుండియే సంవత్సరారంభ మగుచున్నదని చెప్పెదరు. విక్రమార్కుడను రాజు క్రీస్తువునకు పూర్వము ౫౫ సంవత్సరముల క్రిందట అనగాసుమారు ౨౦౦౦సంవత్సరముల క్రిందట యుద్భవించి యార్యావర్తము నంతయు నేకచ్ఛత్రాధిపత్యముగ నేలిన మహారాజు. ఈరాజు మహా సాహసికుడనియు నిసాడనేక మనుష్యాతీతమైన కార్యములచేసి విరాజిల్లె ననియు ననేక గాథలు వ్రాయబడియున్నవి. ఈవిక్రమార్కుడు ఉత్తర హిందుస్థానమందే రాజ్యము చేసెను. ఇతని ముఖ్యపట్టణము "ఉజ్జయని" ఇతడు కొంతకాలమునకు దక్షిణదేశపు రాజును, నాంధ్రచక్రవర్తియు, నగు శాలివాహనునిచే నోడింపబడెను. ఈ విక్రమార్కశకము దక్షిణములో బ్రచారమందులేదు, ఉత్తర హిందుస్థానమందిది విశేషముగా వాడబడుచున్నది.

ఆచారము.—మొత్తముపై యీ మహోత్సవము హిందూదేశ మంతటను బ్రచారమందు దున్నది.

విశేష సంఖ్యాకులు సత్యాకృష్ణులు లోక కంటకుడగు నరకుని సంహరించిన సందర్భముయొక్క జ్ఞాపకార్థముగా నిది నేటికిని పుణ్యదినముగా భావింపబడుచున్నదని నమ్మెదరు. ఈదిన

ఒక స్త్రీ బాణప్రయోగముచే శత్రునాశన మొనర్చగా
నేడు మన యువ్యులును బాణములుకాల్చి (పటాకులు) తమ
కేళిని కలిగించుకొనుచున్నారు. ఈపటాకులు కాల్చుటవలన
విదేశములకు మన ద్రవ్యము పోవుట యొకటి. మనచేతులు పద
లుట రెండు. మన ఇండ్లలో మంటలచే నష్టములు సంభవిం
చుట మూడు. మనప్రాణముల మనమీవిధమున నగౌరవపరచుట
నాల్గు—ఇవి వీని ఫలితములు. ఈపండుగనాడు పటాకులు
కాల్పవలయునని యేగ్రంథమందును వ్రాయబడలేదు.

ఏదియెట్లున్నను మన దేశములో ఆశ్వయుజకృష్ణ చతు
ర్దశినాడు చీకటితోనే యందరును లేచి శిరస్స్నానముచేసి దీప
పములు వెలిగించి పటాకులు కాల్చి పూజాదికము లొనర్తు
దురు.

ఈ దీపావళిపండుగ మార్వాడీలకు చాలాముఖ్యమై
నది. ఆయుత్సవమునాటికి వారు తమ లెక్కల నన్నిటిని పరి
ష్కరించి క్రొత్త ఖాతాపుస్తకములు తెచ్చి పూజించి బ్రాహ్మ
ణామంత్ర ములతో నాశీర్వాదములంది స్నేహితులకు
విందులొసగి చాల యానందముతో నుందురు. వ్యాపారస్థు
లచే నీపండుగ సంవత్సరాదిగా నెంచబడినది.

భవిష్యత్పురాణోత్తర భాగమందు శ్రీకృష్ణుడు ధర్మ
రాజుతో జెప్పినట్లుగా బలిచక్రవర్తి గౌరవార్థము దీపావళిపం
డుగ చేయబడుచున్నదనియున్నది. ఆపురాణమున నీపండుగను
"దీపాలికోత్సవము" అని పేర్కొని యున్నారు. శ్రీకృష్ణుడిట్లు

చెప్పెను:—"పూర్వము బలిచక్రవర్తిని దేవుడు వామనరూపియై భూమిని యాచింప నాతడు సర్వలోకమును నాతనికి ధారవోసెను. అప్పుడు కృతజ్ఞుడై దేవు డీవిషయమున బలిని బూజించు నట్లేర్పాటు చేసెను.

శ్లో॥ విష్ణునా వసుధాలబ్ధ్వా ప్రీతేనబలయేపునః
ఉపకార కరోదత్త స్త్వసురాణాం మహోత్సవః॥

ఈ యుత్సవమును "కౌముది" యని పిలుతురు. కార్తికమాసమును కౌముదీమాసమనియు పిలుతురు. ఈ పండుగ కార్తికాదిలో బలిపాడ్యమి యను పేరగూడ చేయబడుచుండుట చేత దీనిని కొన్ని పురాణములలో కౌముదీ మహోత్సవమని పేర్కొనిరి. ఈపండుగనాడు సర్వస్థలములందు—దేవాలయమ తవృతుల గృహాది స్థలముల యందంతటను దీపములు పెట్టవలయును.

ఈ పండుగ విషయములో "నరకచతుర్దశి" యనుచో నరకయను పదమువలన ననేక సందేహములు కలుగుచున్నవి. నరకాసురుని కర్థముచేసి యాతనివధకై లోకము నేటికిని సంతసించుచున్నదని కొందరు చెప్పుచున్నారు. ఈభవిష్యత్పురాణ

మందలి పైశ్లోకమందు "నరకభీరుభిః" అనుచో నరకమునుండి భయపడువారండ ఱానాదుస్నానము చేయవలెనని యున్నది. కావున నరకమును పొందకూడదను నిష్టముతో నీచతుర్దశి నాడు యమపూజను చేసియు బలిపూజను విస్మరింట చేయవలె నని చెప్పు పైపురాణ ప్రమాణము చాల ముఖ్యమైనది. దీని విషయమై ముందువిమర్శింతును.

ఈ పండుగనాడు ధనికుల యొక్కయు, దొరలయొక్కయు, రెండు డబ్బులనే ఘబ్బునవైన సంపాదించిన కుబేర కుమారుల యొక్కయు, నిండ్లకు వేశ్యవాటికయును వచ్చి యలంకరించుకొని భోగపుసానులు నీరాజనములిచ్చి పూజింతురు. ఈ యాచార మనేక నగరములందున్నది. దీనికిని మన భవిష్యత్పురాణమున నాధారమున్నది. ఈశ్లోకమును చిత్తగింపుడు.

వేశ్యావిలాసినీ సార్థం స్వస్తి మంగళకారిణీ
గృహాద్గృహం వ్రజంతీచ పాదాభ్యంగప్రదాయినీ

భోగముసానులు, మంగళ వాక్యాలతో ఇంటింటికి వెళ్ళి పాదపూజ చేయవలెనని దీని తాత్పర్యము.

## వి మ ర్శ న ము.

నరకాసుర వధకారణమున నీపండుగ యేర్పడినదని యేప్రమాణమగు వ్రతగ్రంథమందును లేనందున నీకథను త్రోసివేయవలయును. మరియు విక్రమార్క ప్రశంసగాని శ్రీరామపట్టాభిషేక ప్రశంసగాని, యీపండుగను చర్చించిన గ్రంథములం

దెండును లేనందున అవియు పరిత్యాజ్యములే. ఇక బలిచక్రవర్తి విషయమే గ్రాహ్యమైనట్టిదని భావింపవలయును. ఈపండుగ నాడు,

ప్రభాతయేత్ స్నానమఖ్యేతు నరకస్యక్షయాయవై

అనగా నరకక్షయముకొఱకై స్నానముచేయవలయును అనుటచేతను

నరకాయ ప్రదాతవ్యో దీపస్సం పూజ్యదేవతాః

అనగా నరకమునకై దీపముల బెట్టి దేవతలను బూజింపవలయును అనుటచేతను

చతుర్దశ్యాంతుయే దీపా - నరకాయ దదంతిచ
తేషాం పితృగణా స్సర్వే నరకాత్స్వర్గ మాప్నయుః

అనగా చతుర్దశి దివసమున నెవ్వారు యమరాజును (నరక) దీపముల బెట్టి పూజింతురో వారి పితరులు నరకమునుండి విముక్తులై స్వర్గమును బొందుదురు అనుటచేతను, నీపండుగ నరకాసురుని సంబంధమైనదు కాదనియు నరక విముక్తికై యముని పూజచేయుటకేర్పడి నట్టిదనియు విశదమగును. అయితే

చతుర్దశీ దినేరాజ్యం బలే రస్త్వితి యాచయేత్.

అనగా చతుర్దశీ దివసమునాడు మరల బలిరాజ్యము వచ్చుగాకయని పూజింపవలయును అనుదానికి సమన్వయము చేయవలసి యున్నది. బలిచక్రవర్తికథలో బూర్వము వామ

నుడు బలిని మూడుపాదముల భూమిని వేడి రెండుపాదములచే భూమ్యాకాశములావరించి మూడవపాదము బలి శిరస్సుపై నుంచియాతనిని పాతాళమున కణగి ద్రొక్కెనని యున్నది. పాతాళమన నరకలోకము. అది చీకటి యుండును. విష్ణువు మూడు పాదములు గలిగినవాడుగా ఋగ్వేదమందు వర్ణింపబడి నాడని లోకమాన్య బాలగంగాధర తిలకుగారు తమ ఆర్కిటిక నిలయమను గ్రంథము నుదాహరించుచు నిట్లు వ్రాసి యున్నారు.

“విష్ణుని త్రిపాదములను గూర్చి ఋగ్వేదమందు పలు తావులలో వర్ణింపబడియున్నది.....సూర్యుని యుదయ మధ్యందిన, అస్తమయములే యీ మూడు పాదములుగ వర్ణింప బడినవని యాస్కునివలె పండితులు తలంచుచు న్నారు. ఈ విష్ణుపాదములే పురాణములో వామనమూర్తి యొక్క మూడడుగులుగ వర్ణింప బడియున్నవి. ఇచ్చట విష్ణు వనగ సూర్యుడని పండితులందఱును ఒప్పుకొనియే యున్నా రు ...... ఈ విష్ణుపాదములలో రెండు మాత్రమే మాన వులకు గాన్పించుననియు మూడవది నరులకుగాని పశుపక్ష్యా దులకుగాని గాన్పించదని, ఋగ్వేదము ౧, ౧౫౫, ౫లో చెప్పియున్నారు (అనగా విష్ణువు మూడవపాదము అధోలోక మందున్నదని దీనియర్థము) ఈ యధోలోకము చీకటిమయ మగను నుండి నరుల కదృశ్యముగా నుండును ......... వేదముల సూర్యుని వార్షికగమనమే మూడు విష్ణుపాదము

లుగ వర్ణింపబడినవి. సూర్యుడు దక్షిణముపైనుండి జనులకు గాన్పించు కాలము విష్ణుని రెండు పాదములగును. తదుపరి సూర్యుడు క్షితిజముక్రిందకు గ్రుంకిపోయి దీర్ఘరాత్రినికల్పిం చినప్పుడు అస్పృశ్యమగు విష్ణుని మూడవపాద మేర్పడును"

పై వాక్యములవలన వామన కథలోని రహస్యము కొంత వెల్లడియయ్యెను. కడపటి వాక్యమందు దీర్ఘరాత్రియన నేమియో గ్రహించిన తక్కిన యంశములు సులభమగును.

ఆర్యులు పూర్వ కాలమందు అనగా సుమారు ౧౦ వేల సంవత్సరములకు పూర్వము ఉత్తరధృవమండలప్రాంతభూము లందు నివసించిరని తిలకుగారు "వైదికనిలయము" అను గొప్పగ్రంథము వ్రాసి నిరూపించినారు. ఆమండల మందు నాటికిని నేటికినిమన దేశమునకు భిన్నముగానుండు ప్రకృతి వైపరీత్యములు చాలగలవు. అందు మనకిప్పుడవసరమగు సంశ మొకటి. అదేదన నాభూభాగమందు ఆఱునెలలు పగలును ఆఱునెలలు చీకటియును నుండును. దీనినే దేవతల కొక దిన మని మనవారనేక గ్రంథములందు వర్ణించిరి. ఈయాఱునెలల పగటిని దీర్ఘదినసమనియు, ఆఱునెలలచీకటిని దీర్ఘరాత్రి యని యు తిలకుగారు వర్ణించినారు. ఈదీర్ఘదివస దీర్ఘరాత్రులెప్పు డారంభమగునో యాయంశమును తిలకుగారు తమ గ్రంథమం దిట్లు వ్రాసియున్నారు. "ఉత్తరధృవము మేరుపర్వతమని మన వారు తెలిపియున్నారు. మఱియు సూర్యసిద్ధాంతము ౧౨ వ అధ్యాయము ౬౭వ శ్లోకములో నీవిధముగా వర్ణింప బడినది.

మేరుపర్వతమువద్ద దేవతలకు మేష సంక్రమణమునాటిసూర్యో
దయ మొక్కటే సూర్యోదయము. ఆదినము మొదలుకొని
సూర్యునియొక్క అర్థావృతమునకు అనగా ఆరు నెలలవరకును
వారు సూర్యుని చూచుచునే యుందురు ......... మేరు
పర్వతమువద్ద మేషసంక్రమణమునాడు సూర్యోదయమగును.
తిరిగి ఆరునెలలవరకు అనగా తులా సంక్రమణమువరకుసూర్యు
డాకాశముననే వెలుగుచుండును. తులాసంక్రమణమునాడు అస్త
మయమగును. తులాసంక్రమణము మొదలు తిరిగి మేష సంక్ర
మణమువరకు సూర్యుడడుగునకు క్రుంకుటవలన ఆరునెలల
వరకు చీకటి వ్యాపించును. దీనిభావ మేమనగ, మేషసంక్రమ
ణము మొదలు తులాసంక్రమణమువరకు ఉత్తరాయణము.
తుల మొదలు మేషమువరకు దక్షిణాయనము. అందువలననే
ఉత్తరాయణకాలము దేవతలకు పగలుగనున్నదని చెప్ప
బడియున్నది. కాని భాస్కరాచార్యుల కాలములో ఉత్త
రాయణ దక్షిణాయన సంజ్ఞలను వారు మార్చిరి. మకర సంక్ర
మణము మొదలు కర్కాటక సంక్రమణమువరకు ఉత్తరా
యణమని వారు నిర్ణయించిరి*

ఈ పై ప్రమాణమువలన ఉత్తర ధృవమండల వాసు
లుగా నుండినప్పుడు మనపూర్వులగు నార్యులకు తులాసం
క్రమణమునాడు దీర్ఘరాత్రి ప్రారంభ మగుచుండెనని తెలి
యును. నాటినుండి తిరిగి యారునెలలవఱకు వారుచీకటి

లోనే కాలము గడుప వలసివచ్చెను. కావున నాచీకటి ప్రవే
శించినతోడనే వామనోత్సవమును జేసి "బలి" యనుశత్రువు
ను పాతాళమునకు తన మూడవపాదముచే నడగద్రొక్కి యచ్చ
టనే తాను బహుకాలముండు వాడగుటచే సూర్యుడు మరల
తమ కగుపడుగాకయని ప్రార్థించుటకై యేర్పాటుచేసిన పం
డుగ యీ దీపావళియని తోచుచున్నది. తులాసంక్రమణము
నాడే దీపావళియనుటకు ప్రమాణముగా ధర్మ సింధు విట్లు
వ్రాయుచున్నది.

తులా సంస్థే సహస్రాంశౌ ప్రదోషే భూతదర్శయోః
ఉల్కాహస్తానరాః కుర్యుః పితౄణాం మార్గదర్శనం.

సూర్యుడు దీపావళినాడు తులారాశిని పొందుచున్నా
డనియు నాడు లోకులు దివిటీలతో తమ పితృదేవతలకు
మార్గదర్శనము జేయువలయుననియు దీనియర్థము. తిలకు
గారు తులా సంక్రమణమునుండి దీర్ఘరాత్రి ప్రారంభమగు
చున్నదని వ్రాసిన ప్రమాణమిదివరకే విపులముగా నుదహ
రించినాడను గావున ధర్మసింధు ప్రమాణము దాని కను
కూలముగా నుండుటచే దీపావళీదినము ఉత్తర ధృవవా
సులకు దీర్ఘరాత్రి ప్రారంభ దినముగా నుండెనని నిశ్చయ
మయ్యె. అందుచేతనే యేపండుగకు లేనట్లు "దీపావళి" నీయు
త్సవమందు వెలిగించునాచారమై యున్నది. చీకటియెడ తెగక
ప్రారంభమగుటచేత నా కష్టకాలము త్వరగా బోవుటకు

